



శ్రీ కృష్ణ.

# సత్యము.

## సుజనులార.

ఈ విషయము దైవము కలడను విషయము వలె రూపించుటకు గష్టసాధ్యమైయున్నది. సాధారణ ుగ బ్రతిపండితులు నీవిషయము నెత్తి వివరించున డొకరితో నొకరు భిన్నాభిప్రాయులయే యున్నా అందుచేత నీయంశము నుపక్రమించుటకు నేను ఝుడియుచునే యున్నాను. ...యుసు శాస్త్రి ...లంది యావిషయమ... చెప్ప... ...సు.

సత్యమనునది ... విధములుగ విభజింప ...యున్నది. అనగా:

సత్యమనియు,

...త్యమనియు,

[3] కాయికసత్యమనియు.

నేను ప్రథమమున మానసిక, కాయిక, సత్యములను వివరించి యీ మూటిలో గష్టతమమగు వాక్సత్యమును వెనుక జెప్పబోవుదును.

మానసిక సత్యము.

మన మందరము, దైవము తప్పక గలడనియు మనము తప్పుజేసిన యెడ నాతడు మనల శిక్షింపక మానడనియును దృఢ నమ్మకము గలిగి యుండవలెను. ఇందుకొక నీతివాక్యము గలదు. ఏమనిన: ఎవడు సత్యమును దెలిసికొన జాలునో యాతడు తప్పక స్వర్గమును గురెరుగును. ఏలనంటే యాతడు సత్యస్వరూపుడయి యున్నాడు.

మఱియు నెప్పుడు నితరులకు మోసకరమును శ్రమకరమునునగు గార్యములను జేయకుండునటుల మనస్సునందు దలంపుగలిగి యుండవలెను. ఈ రెండు యంశములను మనస్సునందు నిలిపికొనినవాడు మానసిక సత్యము కలవాడని యెంచబడును.

కాయిక సత్యము.

దైవికవిధి, లౌకికవ్యాపారములయందును, పౌరుషని

ధిక్కృత కష్టముల యందును గౌరవముగను న్యాయము గను సంచరించు పురుషుడు కాయిక సత్యముంగలిగిన వాడని చెప్పబడును. పై జెప్పిన రెండు విధములగు విధికృతికష్టములయందే కాక- స్నేహ, సంఘ వినోద గృహకృత్యాది కార్యములయందు సహా సత్యమును విడువక దిరుగవలెను. ఈ పై యంశములలో గూడ నితరులకు మోసము జరుపబడకుండునట్లుల గనిపెట్టుచుండ వలెను. వానిలోని నీతులను, నభిప్రాయములను గనిపెట్టుచు సంచరించిన యెడ నదియు కాయికసత్యమనియె యనబడును. వార్ధా ప్రకారము నిర్వహించుట సహా కాయిక సత్యము క్రింది కేవచ్చును.

## వాక్సత్యము.

ఈ విషయము నేను ముందు జెప్పినటులనే యీ మాటిలో నిండు గష్టతమమైన యంశమై యున్నది. మన వేదములో నేమి, మహమ్మదీయుల' ఖురాణ్' లో నేమి, క్రైస్తవుల బైబిలులో నేమి, యనృతమును జెప్పకూడదని స్పష్టముగ జెప్పబడియున్నది. అయితె నా విషయ మనుభవములో నేవిధముగ జరుపబడు

చున్నదియు గనిపెట్టవలెను. ఈవిషయమున శ్రీకృ
ష్ణులువారు మహాభారతమున నేమిగ శలవిచ్చి
యుండిరో దానిం జెప్పెదను. ఒకఋషి తానెప్పు
డు సనృతమును జెప్పనని ప్రతిజ్ఞజేసి యొకయరణ్య
ముందు నివసించి యుండెను. ఇట్టి గొప్పదైన దనప్ర
తిజ్ఞవలన దనచుట్టుపట్టుల నుండుప్రజలచే విశేషముగ
గౌరవింప బడుచు వచ్చెను ఇట్లుండగ జోరులచే వెం
బడింపబడి కొందరు బాటసారులు వారల దప్పించి
కొనుట కాఋషియుండు జోటుకు సమీపమునందు
గల పొదరిండ్లలో జొరబడి మరుగు పడియుండిరి.
అప్పుడాఋషిని జోరులు బాటసారులే దారిని బోయిర,
ని యడుగగా దనప్రతిజ్ఞకు భంగము కలుగునని దల
చి వారిపొదరిండ్లలో డాగియున్నారని చెప్పెను.
అందుచేత జోరులు వారింబట్టికొని వారిధనముల న
పహరించి వెళ్లిపోయిరి. ఇట్టిసంగతి సందర్భములుగ
లసమయములలో నిజము బలికినందున నీఋషి చనిపో
యిన పిదప శాశ్వత నరకములో బడెను. గనుక న
ట్టిసంగతి సందర్భములలో జెప్పబడిన సూనృతము అ
నృత ఫలమునే గలుగజేయును.

మఱియు శ్రీకృష్ణులువారు శలవిచ్చినదేమనిన:-

(1) ప్రాణ సంరక్షణ కొఱకును,

(2) సంభోగ కాలమందును,

(3) వివాహ కాలమందును,

(4) ఒకనియొక్క సర్వధనము పోయినప్పుడును,

(5) బ్రాహ్మణుని గాపాడుటకును,

జెప్పబడు ననృతమునందు పాతిత్యము లేదని శలవిచ్చిరి. ఈయైదు విషయముల నవకాశము కలుగజేసికొని మనహిందువులు అందులో ముఖ్యముగ బ్రాహ్మణులు ఆపైవాక్యముల నాధారముగ జేసికొని తమకు పాతిత్యము సంభవించునటులను, నితరులకు హాని గలుగునటులను, ననృతము నాడుచున్నారు. గనుక నీయైదు సమయములందును గనిపెట్ట బడవలసిన గట్టు బాటులను వివరించి చెప్పబోవుచున్నాడను.

(1) ప్రాణసంరక్షణ మనగా, నిరపరాధియొక్క ప్రాణమును రక్షించుటయే యని తెలిసికొనవలయును —

(2) సంభోగ కాలమందు భార్యా భర్తలయొ
క్క గాని, అట్టివారియొక్క గాని, సంభాషణములు ఆ
హ్లాదకరముగను నింపుగను నుండవలెను గాన నవి
స్తుతి పూర్వకముగాను, చమత్కార యుక్తముగా
ను, వినోదముతో నిండినవిగాను నుండవలసి యుం
డును. గనుక నట్టి సంభాషణములలో నస్పృహయుండిన
యెడ నది సౌఖ్యమును, ఆనందమును, నభివృద్ధిపరచు
నే గాని యాయిరువురిలో నొకరికిని హానిని గలు
గ జేయదు.

(3) వివాహ సమయమందునగా, ఏదైననొకదై
వికమైన యాపద సంభవించి దానిచే గాబోవు వివా
హమాటంక పరుపబడునెడ నప్పుడనృత మాడుటచే
బాతిత్యము లేదు. అటులగానిచో నపుడు చెప్పబడు
సత్య మిరుపార్శ్వముల వారికిని విశేషద్రవ్య హానిని
గలుగజేయుటయె కాక యావివాహమునకు బిలువబడు
వారికి గూడ మిగుల నపదుపాయము సంభవించును.

(4) ఒకనియొక్క యావదాస్తి చెడుటకు, అన
గా నట్టి యుపద్రవము కలిగినపుడనృత మాడుటవల
న బాతిత్యము లేదు. అటుల గానిచో మీాద చెప్ప

కృష్ణులువారు శలవిచ్చిన ఋషికథలోని పాటసారులయొక్కయు, దొంగలయొక్కయు, విధముననే నిరపరాధులు విశేషనాశనము నొందుటయు, దుర్మార్గులందు వలన మేలు నొందుటయు గలుగును.

(5) ఎప్పుడైన ప్రమాదముగగాని, విధిలేకగాని, జరిగించిన దానింబయట బెట్టుటచే బ్రాహ్మణుడు జాతి భ్రష్టుడగుతరి నాతని నట్టియవస్థనుండి కాపాడుటకు నసత్యమును జెప్పవచ్చును. తదితర జాతీయుడు జాతికి జెడినపుడు తనక్రింది సమీపజాతులలో గలియగలడు కాని బ్రాహ్మణుడు జాతికి జెడినపుడు చండాలుడే యగునని ముఖ్యముగ పూర్వకాలమున నిశ్చయింప బడియుండెను. గనుక బ్రాహ్మణు డెప్పుడైన ప్రమాదముచేగాని, విధిలేకగాని, యట్టియవస్థ తప్పించి తద్వారా నిరపరాధ యగునతను జండాలత్వమును బొందకుండుటకై యసత్యమాడుటచే పాతిత్యము లేదు.

గో రక్షణార్థ మసత్య మాడవచ్చుననియు, మఱియొకచోట శ్రీకృష్ణులువారు శలవిచ్చిరి. ఆ గో రక్షణ విషయము పూర్వకాలమున రాజులు గో

వులమందలనుంచి సంరక్షించు యాచారము గలదు. అట్టివానికి నితరులవలన భయము కలిగుచుడసత్యమాడినైయెనను వానిని రక్షింపవచ్చునని యున్నది. ఇందుకు విరాట పర్వములోని యుత్తర గోగ్రహణము ను; దక్షిణ గోగ్రహణమును, నిదర్శనములై యున్నవి.

మఱి యొకచోట శ్రీకృష్ణులువారు శలవిచ్చినదేమనిన—

,,పుణ్యాపాప విచక్షణకు నొకవిధమైన పరిజ్ఞాన ముండవలెను. ఒకప్పుడుగొప్పదైనదని తెలియశక్యముగాని తెలివి కారణమును యోచింపగా దెలిసి కొనబడును; అనేకులు వేదశాస్త్రములె నీతిని జెప్పుతవని యనియెదరు వానిని నేనాక్షేపించను గాని వేదశాస్త్రములు ప్రతివిషయమును గలిగి యుండవు జీవులయభివృద్ధికొఱకు నీతివాక్యములు చెప్పబడి యున్నవి- హింసారహితమైన వానితో సంబంధించినది నీతియేను. ఇదియె నీతి ధర్మము- సత్యము- ఎప్పుడైన సహేతుకముగాని నీతి నవలంబించి తాను నీతిమంతుడ నగుదునని యుద్దేశించిన వానితోను, లేక అందువలన దసకాధిక్యము గ

లుగుననియున్న వానితోను సంపర్కమును గలుగఁజేసికొనఁగూడదు. కాని నీతులలో నెద్ది యుక్తి యుక్తముగాకయుండునో అట్టివిధి ననుసరింపవలసినటుల పనిలేదు” ని శలవిచ్చిరి. అందుచేత నటుల దిరుగక పోవుటవలన నసత్యము లేదని మనము తెలిసికొనవలెను.

భీష్ములవారు యుధిష్ఠిరునిచే సత్యము వివరింపుమని యడుగఁబడి యా సత్యమును 13 విధములుగ విభజించిరి. అందు మానసిక- కాయిక- సత్యములె చెప్పబడినవి. అవి యెవ్వియనః—

(1) సమత్వము
(2) దమము
(3) అమాత్సర్యము.
(4) క్షమ.
(5) లజ్జ
(6) తితీక్ష.
(7) అనసూయ.
(8) త్యాగము.
(9) ధ్యానము.
(10) ఆర్యత్వము.



(11) ధృతి.

(12) దయ.

(13) అహింస.

భీష్ములవారు వివరించిన విధమును బట్టి చూడ గా సత్యము యొక్క పర్యవసానమును ముఖ్యముగా గనిపెట్టవలసినట్లు స్పష్టమగుచున్నయది-

సాధారణవర్తక వ్యాపారముల యందనృతమాడుట వాడుకగ నున్నది యెగదా? అయితే నితరుల కది నష్టమును గలుగ జేయును. గాన బాతిత్యకరమే యగును. వాడుకలో జనులు బాలురతోను, రోగకీడుతులతోను, వారిమేలుకొఱకసత్యము నాడుచుందురు- ఒకరొకని యింటికి దర్శనార్థమై వెళ్ళినప్పుడు నాయింటి యజమానుడు గాని, యజమానురాలుగాని, చూచుటకు వీలులేనపుడింటివద్ద లేఁనిమర్యాద కొఱకు జెప్పించుటయును గలదు-

ఇంక బర్యవసానమేమనిన శ్రీకృష్ణులు వారు శలవిచ్చిన ప్రకార మట్టి విధులకు లోబడిన విషయములు తటస్థించినపుడు అనృతమాడుటవలన దోషము లేదు. ఇంక నా విధులకు సమానవిషయములు తట

క్షించినపు డామనుజుడు అనృతమాడుట వలనగలిగిన పాతిత్యము నిరపరాధులకు హానికరమైన సత్యము జెప్పుటవలన గలుగబోవు కీడుకంటె హెచ్చుగనుండునో తగ్గుగనుండునో విచారించి పాతిత్యము హెచ్చుగ నుండినచో సత్యమునే బలుకవలెను తగ్గుగనుండినచో నసత్యమునే పలుకవలెను-

ఈ నిబంధనను మనస్సునందు దృఢపఱచికొని మాటలాడిన వాడు సత్యవాక్యుడే యగును.

గనుక పైని చెప్పబడిన మూడువిధములగు సత్యమును బ్రతిమనుజుడు బహుజాగ్రత్తగ గనిపెట్టి యాసత్యమును విడువక యుండవలెను.

వేం॥ స్వా॥ రం॥
బొబ్బిలి.




Sri Rangaraya Vilasa Press Printed by
K. Padmanabha Patnayak. Bobbili 1903.